ఆరుగురు రాక్షసభటులు ఎదురై అభిమన్యునితో తగవులాడుతారు. కత్తెరబాణం వదలి అభిమన్యుడు వాళ్ల ముక్కు చెవుల్ని కత్తిరించి వేస్తాడు. వీళ్లు ఘటోత్కచుని వద్దకు పారిపోతుండగా వీళ్ల భార్యలు చూచి ఆగ్రహించి అభిమన్యుని తుదముట్టించడానికి బయలుదేరుతారు. వాళ్లు చెరువులలోని నీళ్లన్నీ తాగి వాటిని వరదలుగా ఈతనిపై చిమ్ముతుంటారు. అదంతా మహాప్రవాహంగా మారి అభిమన్యుడందులో కొట్టుకపోయే విధంగా జేస్తారు. అప్పుడు అభిమన్యుడు ముద్దెరబాణం వదలి రాక్షసస్త్రీల నవరంధ్రాల్ని మూసి వేస్తాడు. ఈ అల్లరి అంతా ఘటోత్కచునికి తెలుస్తుంది. అప్పుడాతడు పన్నెండు పుట్ల దూదితో నేసిన దుప్పటి కప్పుకొని, పర్వతమంతటి స్థూలకాయంకలిగి, మహా భయంకరంగా ఉంటాడు ఆతడు అభిమన్యుని మీదికి యుద్ధానికి బయలుదేరుతాడు. కుమారునికి ఏ ప్రమాదం వాటిల్లుతుందోనని హిడింబ భయపడుతుంది. అప్పుడు ఘటోత్కచుడు ఆమెకు ధైర్యం చెప్పి, తాను మరణిస్తే కొన్ని విపరీతాలు జరుగుతాయని ఆనవాళ్లుకూడ వివరిస్తాడు. ఏ జిల్లేడు చెట్టకైతే హిడంబ ఉయల కట్టబడిందో, ఆ జిల్లేడు చెట్లు ఎండిపోతాయనీ, దాపునఉన్న చెరువులోని నీటిని హిడింబ పీల్చి వదలితే రక్తంగా ప్రవహిస్తుందనీ, ఆమె ఒక స్తనంనుండి రక్తమూ, మరొక స్తనంనుండి నీళ్లూ ధారలు కడుతాయనీ తన మరణానికి ఆనవాళ్లుగా చెప్పి ఘటోత్కచుడు వెళ్లిపోతాడు. పిదప అభిమన్యునికీ ఘటోత్కచునికీ ఘోర యుద్ధం జరుగుతుంది. అభిమన్యుడు నేలకూలుతాడు. సుభద్ర పుత్రశోకంతో శ్రీకృష్ణ పరమాత్ముని ధ్యానించుకుంటుంది. శ్రీకృష్ణుడు వాయుదేవునితో అమృతంపంపిస్తాడు. వాయుదేవుడు అభిమన్యుని నోట్లో అమృతం పోస్తున్నప్పుడు గాలికి ఎగిరివచ్చి కొంత సుభద్ర కండ్లలోకూడ పడుతుంది. అభిమన్యుడు వెంటనే లేచి ఒక చెట్టుకింద విశ్రమిస్తున్న ఘటోత్కచునితో మళ్లీ తలపడుతాడు. ఘటోత్కచుని ముందు అభిమన్యుడు ఒక చీమవలె ఉండి ఆతనికి దొరకకుండా సందుల్లోనుంచిదూరి తప్పించుక పోతుంటాడు. అభిమన్యుడు చాకచక్యంతో ఘటోత్కచుని కేశములు పట్టుకొని పైకిప్రాకి ఆతనితలపై బలంగా కొట్టగా ఘటోత్కచుడు నేలకూలి మరణిస్తాడు. ఆతనికోసం విలపిస్తూ వచ్చే బంధువు లెవరైఉంటారో చూడాలని సుభద్ర అభిమన్యులు రథంపై కూర్చుండి కుతూహలంతో చూస్తుంటారు. ఇంతలో అక్కడ హిడింబకు ఇదివరకు తెలిపిన ఆనవాళ్లన్నీ నిజమవుతాయి. ఆమె తన కుమారుని కేదో కీడుమూడిందని గ్రహించి, పరుగెత్తుకొని వచ్చి కుమారుని మృతదేహంపైబడి పాండవుల్నీ భీమున్నీ తలచుకుంటూ విలపిస్తుంది. పాండవుల ప్రస్తావన విన్నంతనే సుభద్ర అభిమన్యులు ఆశ్చర్యంతో పరుగు పరుగున వచ్చి హిడింబను కలిసికుంటారు. వాస్తవాన్ని అడిగి తెలిసికొని ఆమెను హిడింబగానూ, ఆతన్ని ఘటోత్కచునిగానూ గ్రహించి, జరిగినదానికి విచారిస్తుంటారు. కాని ఇంతకు

ముందే వాయుదేవుని ప్రభావంతో సుభద్ర కంటిలోపడిన అమృతంతో ఘటోత్కచుని బ్రతికించుకుంటారు. అనుకోకుండా ఆత్మీయులు కలిసికున్నందుకు సంతోషిస్తారు. శశిరేఖను సాధించడం కోసం అభిమన్యునికి సహాయం చేయడానికి ఘటోత్కచుడుకూడా తన రాక్షస బలగంతో బయలుదేరుతాడు. అంతా కలిసి ద్వారక చేరి తూర్పువైపున ఉన్న ఒక లేతమామిడి తోటలో దిగుతారు. అంతకుముందే కౌరవులంతా ద్వారక చేరి పడమటి వైపు తోటలో విడిదిచేస్తారు. ఘటోత్కచుడు మాయాబలంతో తన రాక్షసులనందరినీ అందమైన ఆభరణాలుగా, ఆయుధాలుగా రథగజ తురగాలుగా మారుస్తాడు. కౌరవులంతా తమతమ పాత వస్తువులన్నీ ఇచ్చి, ఆకర్షణీయంగా కనిపించే ఈ కొత్త వస్తువుల్ని కొనుక్కుపోతారు. అంటే కౌరవుల ఆభరణాలూ ఆయుధాలూ, వాహనాలన్నీ అభిమన్యుని శిబిరం చేరుకుంటాయి. ఘటోత్కచుని రాక్షసులంతా అందమైన ఆభరణాలూ, ఆయుధాలూ, వాహనాల రూపంలో కౌరవుల విడిది చేరుకుంటారు.

మరొకవైపు ఘటోత్కచుడు తన మాయాబలంతో దాసీదాని వేషంవేసుకొని బలరాముని భార్య రేవతి వద్దకు వెళ్లుతాడు. దుర్యోధనుని భార్య అయిన భానుమతి శశిరేఖను చూడదలచి ఆమెను తీసుకరావలసిందిగా తననిక్కడికి పంపించిందని నమ్మబలుకుతాడు. ఈ మాటలు నమ్మి రేవతి దాసీవేషంలో ఉన్న ఘటోత్కచునివెంట శశిరేఖను పంపిస్తుంది. ఘటోత్కచుడు శశిరేఖను తీసుకవెళ్లి అభిమన్యునకప్పగిస్తాడు. తానేమో శశిరేఖ రూపం ధరించివచ్చి రేవతిని కలిసి అంతఃపురంలో ఉంటాడు. ముహూర్త మాసన్నం కాగానే మాయా శశిరేఖను కళ్యాణమంటపానికి తీసుకవస్తారు. వివాహవేదికపై లగ్నం జరుగుతుంటుంది. వధూవరులు ఒకరిపై నొకరు తలంబ్రాలు పోసుకునే సమయంలో శశిరేఖ రూపంలో ఉన్న ఘటోత్కచుడు లక్ష్మణునిపై తలంబ్రాలకు మారుగా పలుగు రాళ్లు పోస్తుంటాడు. లక్ష్మణుడు బాధతో అరుస్తాడు. ఐనా అక్కడ ఉన్నవాళ్లందరికి పలుగురాళ్లు తలంబ్రాలుగానే కనిపిస్తుంటాయి. కనుక పెండ్లికుమారున కేదో దుష్టగ్రహం సోకిందని కౌరవులంతా భావిస్తారు. తొందరగా వివాహం ముగించుకొని తమ విడిది చేరుకుంటారు.

ఈ వివాహ మహోత్సవానికి హాజరై తమాషా చూద్దామని వచ్చిన నారదునికి ఘటోత్కచుని మహిమలేవీ తెలియక, తానాశించినట్లుగా కలహం పుట్టనందుకు విచారిస్తూ- "కుక్కకునేయి ఇముడదనుకుంటే ఇముడేకాలం వచ్చిందికదా" అని బాధపడుతుంటాడు. ఇది ఘటోత్కచుడు వింటాడు. వెంటనే ఆతడు నారదునిపై కోపంతో చేయి విసరగా ఆ దెబ్బతో నారదుడు ఊరవతల ఒక మడుగులో పడుతాడు. అప్పుడు నారదుడు

ఈతడెవ్వడా అని ఆశ్చర్యపడి తన దివ్యదృష్టితో జరిగినదంతా తెలిసికొని సంతసిస్తాడు. తరువాత ఘటోత్కచుడు కౌరవుల విడిదిలో విలువైన వస్తువుల రూపంలో ఉన్న తన రాక్షసబలగాన్నంతా ఎప్పటి మాదిరిగా మార్చివేస్తాడు. తక్షణమే వాళ్లు తమ నిజరూపాలు ధరించి కౌరవ సైన్యాన్నంతా మింగివేస్తారు. ఐతే కౌరవుల్ని కనుక హతమారుస్తే ఈ వివాహ శుభ సమయంలో పాండవులకు సూతకం వస్తుందన్న ఉద్దేశంతో వాళ్లను వదలివేయవలసిందగా ఘటోత్కచుడు ఆజ్ఞాపిస్తాడు. అప్పుడు అభిమన్యుడు వాయు బాణం వదలగా కౌరవులంతా ఢిల్లీలో విసిరి వేయబడుతారు.

పిదప అభిమన్యుడు శ్రీ కృష్ణుని అభిమతంతో శశిరేఖను వివాహమాడి బలరామ కృష్ణుల ఆశీస్సులు పొందుతాడు. ఘటోత్కచుడు తోడురాగా సుభద్ర, శశిరేఖలతో అభిమన్యుడు హస్తినాపురం చేరి సుఖంగా ఉంటాడు.

